# నంది మూపురం

## (కథ)

**(The Hump on Nandi's Back)**




మూలం

**డి.డి. కోశాంబి**

స్వేచ్ఛానువాదం

**గౌరవ్**



**అభివ్యక్తి**

**ఆంధ్రప్రదేశ్ – తెలంగాణ**

# నంది మూపురం

(The Hump on Nandi's Back)

ఆంగ్ల మూలం : డి.డి. కోశాంబి

తెలుగు : గౌరవ్

ⓒ కాపీలెఫ్ట్ : సర్వహక్కులు సమాజానివి

ప్రచురణ : మార్చి, 2017

ప్రతిపాదిత చందా : 5/-

ప్రతులకు : 90320 94492

వివరాలకు : gouravmeka@gmail.com

## మనవి

బహుశా డి.డి. కోశాంబి పిల్లల కోసం రాసిన ఏకైక కథ యిది. ఇంగ్లాండ్‌లో ఉంటున్న కోశాంబి మిత్రుడు దివ్యభానుసింగ్ చౌడాకి ఆయనిది 1966లో చనిపోడానికి కొద్దికాలం ముందే పంపించడం జరిగింది. దశాబ్దాలుగా వివిధ సామాజికాంశాల్లో పనిచేస్తున్న అరవింద గుప్తా గారి www.arvindguptatoys.comలో ఈ కథ (మూలం) దొరుకుతుంది. పిల్లలకు, సైన్సుకు ఇంకా అనేక ఆసక్తికర విషయాల కోసం ఆ వెబ్‌సైట్ చూడొచ్చు. వివిధ సామాజిక అధ్యయనాంశాల్లో మహామేధావిగా పేరొందిన కోశాంబి ఈ కథనాన్ని పిల్లలకి అనువయిన రీతిలో చాలా హృద్యంగా మలిచాడు. ఆహ్లాదకరమయిన పల్లె అందాల్ని వర్ణిస్తూనే, మానవ పరిణామ క్రమాన్నీ, జీవ పరిణామాన్నీ నైపుణ్యంతో చెప్పాడు. ఇది తెలుగులో వొచ్చిందో లేదో తెలీదు. వొచ్చున్నా ఈ చిరు ప్రయత్నం వల్ల నష్టపోయేదేం లేదు. అనేక అవాంఛనీయ ఆకర్షణల పాలుబడి పాలిపోతున్న ఈ తరం బుజ్జాయిలకిలాంటి కథలెన్నయినా చెప్పడం చాలా అవసరమనే ధోరణే ఈ ప్రచురణకి ప్రేరణ, సెలవు.

– అనువాదకుడు

# నందిమూపురం

ప్రతీ సంవత్సరం జరిగే పశువుల పండుగ ఆరోజే. గ్రామపెద్ద కొడుకు రాముడు, వాళ్ళింట్లోనున్న పెద్ద ఎద్దు నందిని మేతకి తీసికెళ్ళాడు. సాయంత్రం జరిగే తిరునాళ్ళలో అది ఉత్సాహంగానుండడానికి ముందుగానే అలా చేసాడు. చిట్టడివి చివరగల కొలను దగ్గర, గ్రామదేవతగా కొలిచే బోధిచెట్టు నీడలోకి అతని మిత్రులంతా వొచ్చారు. భారతదేశంలోని ఎడ్లకి మూపురాలెందుకుంటాయనే విషయాన్ని చర్చించుకొంటున్నారు.

**రాముడు :** "నందీ! ఎద్దులకే ఎందుకు మూపురాలుంటాయి? ఆ నీట్లోని బర్రెనీ, అక్కడున్న గుర్రాన్నీ చూడు వాటి వీపులెంత చదునుగా ఉన్నాయో"

అప్పుడే రాముడి కుక్క మోతీ కూడా గబగబా గెంతుతూ వొచ్చి ఆయాసపడసాగింది. అదేమందంటే "భౌ, వౌ! నేను పిల్లిని తరిమినప్పుడు అదెలా దూకుతుందో నీకు తెల్సు కదా. అలా భయపడినప్పుడే నంది వీపు కూడా ఉబ్బుతుందనుకుంటా" మోతీ, నందీ గుంత దగ్గరికి దప్పిక తీర్చుకునేందుకు వెళ్ళాయి.

"బెక–బెక–బెక" మంటూ కప్ప నీట్లోంచి గెంతి వొచ్చి ఏమందంటే, "మన నంది ఎందుకు భయపడుతుంది? ఆరోజు పెద్దపులే నందిని పడగొట్టలేకపోయింది కదా! నేనెలా ఉబ్బానో చూడండి, నంది కూడా తన మూపురాన్ని నాలాగే గాలితో నింపుకునుంటుంది."

ముసలి నాగుపాము మెల్లగా తన పుట్టలోంచి బోధిచెట్టు వైపు పాకురుకుంటూ వచ్చింది. 'బుస్ బుస్! గాలి గుండెలో కెళుతుంది, వెనకక్కాదు. ఒకసారి నేనో పెద్ద ఎలకని మింగి వారంపాటు పడుకున్నాను. అప్పుడు నా కడుపు పెద్ద ముద్దలాగైంది. నంది తప్పకుండా పెద్దదేదో మింగేసుంటుందంతే."

"బో, బో, బో!" అని అరుస్తూ అడివిలోంచి ఎలుగుబంటొచ్చింది. "అంటే, నంది పెద్ద గుమ్మడికాయను మింగిందనా? అదంతా ఏం కాదు. నాకోసారి మొహంమీద తేనెటీగ కుట్టింది. అప్పుడెలా ఉబ్బిందో తెల్సా? కచ్చితంగా నందిని కూడా ఏదో అలాగే కుట్టుంటుంది."

ఇంతలో చెట్టు కొమ్మ నుంచి కోతి దిగింది. "వూప్‌వూప్‌వూప్! చూడండి. ఈ చెట్టు పళ్ళు తినితినీ నా దవడల కిందెలా ఉబ్బిందో. నంది తన మేతను

కచ్చితంగా దాచుకుంటుంది. అలా అది తన మూపురంలో దాచుకోకపోతే, తిరిగి కావాల్సినప్పుడు తన నోట్లోకెలా తెచ్చుకుని నెమరేసుకోగలుగుతుంది? చూడండి అదెలా నెమరేసుకుంటోందో."

"పీనాసి కోతిలాగే మాట్లాడావులే" రాముడన్నాడు, "మూపురం ఎప్పుడూ ఒకలాగే ఉంటుంది. కాని పళ్ళు ఎక్కువగా తిన్నప్పుడే నీ చిగుళ్ళు వాస్తాయి. అలాగైతే నంది మూపురం పెరుగుతూండాలి కదా? నందీ, నీ మూపు గురించి నువ్వే చెప్పు" నంది మాట్లాడుతూ, "ఎడ్లన్నింటికీ కొమ్ముల్లాగానే మూపురాలుంటాయనుకునేదాన్ని నేను, కానీ నిన్న జరిగిన జిల్లాస్థాయి ప్రదర్శనలో నాకు మొదటి బహుమతొచ్చింది చూసారూ, అప్పుడక్కడికి వాళ్ళు యూరోపియన్ ఎడ్లను తెచ్చారు. నాకవి చాలా వింతగా కనిపించాయి! కొమ్ముల్లేకుండా, సాఫైన, చదును వీపుల్తో, అవి సణుక్కుంటున్నాయి, "చూడండి! ఆ పెద్ద మూపు గూనెద్దుకి మొదటి బహుమతట!" మీ మనుషులు ఎడ్లకేదో చేసారనుకుంటా నేను. బండి కట్టడానికి మూపు బాగుంటుంది. నాగలిని నేనందుకే సులువుగా ఈడ్చగలను. ఆ విదేశీ ఎద్దులు వాటి దేశంలో గుర్రాలా పనిచేసేవని చెప్పాయి. ఇప్పుడు యంత్రాలు చేస్తున్నాయట.

***రాముడు ఒప్పుకోలేదు :*** "ఇదిగో ఈ పుస్తకంలో మన దేవుడు శివుడు వాహనం నందని ఉంది. కాబట్టీ, కూర్చుని చేరబడ్డానికి వీలుగా దేవుడు నందికి మూపురం చేసుంటాడు. చూడండి, ఈ బొమ్మలో శివుడెలా సుఖంగా ప్రయాణిస్తున్నాడో కూర్చొని. ఇప్పుడు మన గ్రామదేవతైన ఈ బోధి చెట్టును నంది మూపురం గురించి అడుగుదాం."

***బోధివృక్షం చెప్పింది :*** "నంది అన్నది సరైందే. మనుషులు ఎడ్లనలా చేసారు. కుక్కల్ని మోతీలా మల్చుకున్నారు. ధాన్యాన్నీ, గోధుమల్నీ చేసారు. మొత్తంగా మనిషి తనని తానే చేసుకున్నాడు."

***రాముడు :*** "అదెలా అవుతుంది? కొత్తగా కట్టిన మా ఇల్లు కిందటేడాదే పూర్తయింది. దానిని మనుషులు చేసారు. చెట్లు నరికి, దుంగల్ని రంపంతో పొడుగ్గా కోసి చేసారు. దానికి బోలెడంత మంది మనుషులు కావల్సి వచ్చారు. ఇంటిపైకప్పు వేస్తుండగా నాన్నకి నేను సాయం కూడా చేసాను. కాని మనం నందిని ఎలా తయారుచేయగలం? అదో, చిన్న దూడపిల్లగా మూపురంతోనే పుట్టింది. మోతీ అప్పట్లో బుజ్జికుక్క పిల్లే. నే చేసిందంతా అమ్మ చూడకుండా నా కంచంలోని అన్నాన్ని దానికి పెట్టడమే. కానీ, మనం కుక్కగానైతే దాన్ని తయారుచేయలేదు.



ధాన్యం విత్తనాలుగా నాటబడుతుంది. నాలుగు నెలల్లో అలాటి ధాన్యమే బోలెడంత పండుతుంది. దాన్నెవరూ తయారుచేయలేదు."

***బోధివృక్షం :*** "నువ్వెంతో తెలివైనవాడివి రామా. చురుకుగా నేర్చుకునే పద్ధతిదే. నిజం తెల్సేంతవరకూ ప్రశ్నిస్తూ పోవడమే. ఇప్పుడిక జాగ్రత్తగా విను. నా కళ్ళతో ఏదైతే చూసానో అది చెప్పనివ్వు. కొన్నివేల సంవత్సరాల క్రితం మనుషులు కోతుల్లాగానే జీవించారు. పళ్ళూ కాయల కోసం చెట్టెక్కేవారు. బెర్రీల్నీ, పుట్టగొడుగుల్ని తెంపుకునేవాళ్ళు. మట్టిలోంచి దుంపల్ని తవ్వుకునేవారు. ఎలుగులా తేనెని చెట్లెక్కి సేకరించేవాళ్ళు. మాంసం కోసం జంతువుల్ని చంపేవాళ్ళు. నిప్పూ, నాగలీ, గుడిశెలు, గృహాలు ఏమీ లేవప్పుడు. గ్రామాలే లేవు. గ్రామదేవతలూ, దేవుళ్ళూ లేరు. ఆహార సేకరణ ద్వారానే మనుషులు బతికేవారు. ఇప్పుడు పండించడం చేస్తున్నారు."

***రాముడు :*** అలా జీవించేటట్లయితే మరి, ఆహారాన్ని పండించడం ఎందుకు? మా నాన్న, పెద్దన్నయ్య పొలంలో ఎంత కష్టం చేస్తారో చూడండి. ఏ కష్టం లేకుండా మనముండవచ్చు కదా?

***బోధిచెట్టు :*** "చాలినంత ఆహారం ఎప్పుడూ దొరకదు. నదులు ఎండిపోయినప్పుడు గడ్డుకాలమొస్తుంది. ఆటలేం సాగవు. పళ్ళేవీ ఉండవు. సంవత్సరమంతా ఆహార సేకరణలో గడపలేవు కదా. అందుకోసం మనుషులు ఆహారాన్ని భద్రంగా దాచడం నేర్చుకున్నారు. వర్షాకాలం తర్వాత మంచి పంటలొస్తాయి. దానినే నువ్వూ సంవత్సరమంతా తింటావ్. బాగా పండిస్తే, మరింత మంది మనుషులు బతకొచ్చు. నా చిటారు కొమ్మనుంచీ నీకిప్పుడు ఐదు పెద్ద గ్రామాలు చుట్టుపక్కలవి కనిపిస్తాయి. పాత రోజుల్లో ఆ ప్రాంతాల్లో కనీసం ఐదుగురు మనుషుల్ని కూడా నేను చూసింది లేదు.

***రాముడు :*** "సరే, కానీ, మరి నా మోతీవంటి కుక్కల్ని వాళ్ళెందుకు చేసారు?"

***బోధిచెట్టు :*** "వేటాడేటప్పుడు తోడేళ్ళు అనుసరించేవి. అలా నక్కపిల్లల్ని మనిషి మచ్చిక చేసుకున్నాడు. కానీ, అవి పెద్దవయిన తర్వాత తోడేళ్ళలాగానే క్రూరంగా మారిపోయేవి. అయితే, కొన్ని మాత్రం మనుషులతోనే ఉండేవి. అవి మనుషుల కోసం వేటాడేవి. మాంసపు వ్యర్థాలు, ఎముకలు మనుషులు వాటికి పెట్టేవాళ్ళు. అలా మచ్చిక చేసుకోబడిన నక్కల్నే మనం కుక్కలంటున్నాం."

**రాముడు :** "వాళ్ళలా చేయడం ఎంత మంచిదైందో. నా మోతీ లేకుండా నేనేం చేయగలను? కానీ నంది వెనకున్న మూపురం సంగతేంటి మరి? మనమసలు దాంతోనే మొదలెట్టాం, ఇంకా నువ్వు జవాబు చెప్పనే లేదు."

**బోధిచెట్టు :** "లేళ్ళను, జింకల్ని తరమడం మనుషులకి కష్టంగా వుండేది. అడివి దున్నలు కూడా ఉండేవి కానీ మెల్లగా కదిలేవి. మనుషులు మాంసం కోసం వాటి వెంట పడేవాళ్ళు. తర్వాత వాళ్ళు కొన్ని దూడల్ని మోతీలానే మచ్చిక చేసుకున్నారు. బాగా బలిసిన వాట్నే తీసుకునేవారు. అలా కొన్నిటికి చిన్ని మూపులుండేవి. మూపురం మరింత ఎక్కువ మాంసాన్నిచ్చేది. కాబట్టీ, అలా మూపురాలున్న దూడల్నే మచ్చిక చేసుకోవడం మొదలెట్టారు. అలా, మూపురం పెద్దదైంది. ఐతే ఈ మూపురం కల పశువులు త్వరగా మచ్చికై పెంపుడు జంతువులుగా మారతాయని మనుషులు తెల్సుకున్నారు. ఆవులు పాలిచ్చేవి. అలా, వేటాడ్డానికి బదులుగా, మనుషులు మందల్ని మేపడం మొదలెట్టారు. అందుకే నందిలాంటి పేద్ద ఎద్దులు మనకున్నాయి."

**రాముడు :** 'అది చాలా తెలివైన పని. తిండి గింజల సంగతేంటీ?"

**బోధిచెట్టు :** "చాలాకాలం క్రితం, కరువు కాలంలో మనుషులు ఆకులూ అలమలు గడ్డి విత్తనాలు తినడాన్నే తరచూ చూసేదాన్ని. వాళ్ళకింకేమీ దొరికేవి కాదు. త్వరలోనే కాస్త లావయిన పచ్చిక విత్తుల్ని కనుగొన్నారు. ఈ రకమయిన పచ్చిక మృదువైన భూమిలో బాగా పండుతుందన్న విషయం తెల్సుకున్నారు. మెత్తగానున్న నున్నని నేల ఎక్కువగా ఉండదు. కానీ, పదునైన కర్రతో నువ్వు తవ్వడం మొదలెట్టి దుంపలు తీయడం జరిగాక మరుసటి సంవత్సరానికి అక్కడ గడ్డి బాగా మొలుస్తుంది. కాబట్టీ, మనిషి లావైన గడ్డిగింజల కోసం నేలకి కన్నాలు చేసాడు. అలా లావైన విత్తుల్ని నాటడం నేర్చుకుని రానురాను వృద్ధి చెందాడు.

**రాముడు :** "మేమలా ధాన్యాన్ని పండించం. అరకతో దున్నుతాం. మనుషులు నాగలిని వాడటమెలా నేర్చుకున్నారు?"

**బోధిచెట్టు :** "దానికి వాళ్లకి చాలాకాలం పట్టింది. మొదట్లో, వాళ్ళు కర్రతో నేలని గోకేవారు. అది పెద్దగా కలిసొచ్చేది కాదు. అలాగే, పచ్చి ధాన్యం తినేందుకు కూడా బాగోవు. మనుషులు మంటని కనుక్కోవాలి. అడివి కాలినప్పుడు మనుషులు భయపడేవారు. జంతువుల్లాగానే పారిపోయేవారు. తర్వాత



వొండుకోవడం మొదలెట్టారు. మంటతో మట్టిపాత్రలు కూడా చేసేవారు. అలా కర్రని భూమిలోనుంచి బలంగా ఈడ్వడానికీ, లాగడానికీ బలం కావాలి. కాబట్టీ వాళ్ళు ఎత్తైన పశువుల్ని నేలని తవ్వే కర్రని లాగడానికి వీలుగా మార్చుకున్నారు. అదే నాగలి. దాంతో ఎక్కువ ఆహారం దొరుకుతుండేది. కానీ, మనుషులు చేసే వ్యవసాయానికి మరింత పెద్ద పశువులు కావల్సి వచ్చాయి. అప్పుడిక వాళ్ళు పశువుల్ని ఆహారం కోసం చంపడం మానేసి నందిలాంటి మాంచి బలమయిన ఎడ్లను సంపాయించుకోగలిగారు."

**రాముడు :** "నందిని తినడమనే ఆలోచనే ఏదోలా ఉంది. కానీ నువ్వేదో మనిషే తనని తాను తయారుచేసుకున్నాడని చెప్పావు కదా. నేనింకా దేవుళ్ళు చేసారనుకున్నా.

**బోధిచెట్టు :** "మనుషులకి మంటలంటే భయం ఎలా పోయిందో నీకింతకు ముందే చెప్పా కదా. అప్పుడిక, మంటను మనిషి దేవుడిగా చేసి పూజించాడు కూడా. త్వరలోనే, మంటను పుట్టించడమెలాగో మనిషి తెల్సుకున్నాడు. చెకుముకి రాళ్ళను రాపాడించేవాడు. తర్వాత నన్నూ నందినీ పూజించడం కూడా మొదలెట్టాడు. మేం వాళ్ళకి ఆహారాన్నిస్తాం. నా పళ్ళు ఇప్పటికీ తినడానికెంతో బాగుంటాయి. కానీ, నా దాయాది అత్తిచెట్టుపండ్లనే మనుషులెక్కువగా ఇష్టపడతారు. అత్తిపళ్ళు లావుగా, పెద్దగా, తియ్యగా ఉంటాయి. అత్తిచెట్టు చాలా చిన్నది, బలహీనమైంది. దానికి మంచి నేల కావాలి. ఎంతో నీరు కూడా కావాలి. కానీ, అడివనేది మొత్తం పోయినా నాకు నేనుగా పెరగగలను. చాలాసార్లు కార్చిచ్చు తక్కిన నా కుటుంబాన్నంతా కాల్చేసింది కూడా. అయినా, నేనెప్పుడూ ఎదుగుతూనే ఉన్నాను. ప్రజలింకా నన్నూ, మంటనీ, నందినీ పూజిస్తూనే ఉన్నారు. కానీ మరీ అంతెక్కువగా కాదు. మేమైతే మనిషిని చేయలేదని నీకు చెప్పగలను."

**రాముడు :** "మరైతే ఎవరు చేసారు?"

**బోధిచెట్టు :** "మనిషి ఎలా ఉన్నాడో అలా తనని తానే మల్చుకున్నాడు. ప్రారంభంలో, అతనొక చిన్న స్నేహశీలమయిన జీవిగా, కోతిలా ఉండేవాడు. కానీ అశక్తుడు, అసహాయుడు. మంటను కనుగొన్న తర్వాత అతడు లోహాల గురించి గ్రహించాడు. మొదట రాగినీ తర్వాత ఇనుమునీ కనిపెట్టాడు. అంతక్రితం, అతడు తన వేటకు రాతి ఆయుధాల్నీ మాత్రమే ఉపయోగించేవాడు. అలా విల్లంబుల్ని వేటకి

వాడేవాడు. తోలు బుట్టల్ని, సంచుల్ని ఆహారాన్ని దాచుకునేందుకు వాడేవాడు. వలల్ని చేపలు పట్టడానికి వాడేవాడు. అలా మరింత ఆహారం పొందేవాడు. వ్యవసాయమనే పేద్ద పని అతడ్ని శక్తివంతుడిగా చేసింది. బరువులు మోయడం అతడ్ని నిలుచుని నడిచేలా చేసింది. తర్వాత అతను గుడిసెలు, ఇళ్ళూ నిర్మించాడు. బట్టలు కట్టుకున్నాడు. పాత రోజుల్లోనైతే ఎదిగినవాళ్ళు కూడా నా నీడలో నగ్నంగానే ఉండేవాళ్ళు. చిన్నప్పుడు నువ్వెలా ఉన్నావో అలాగే."

**రాముడు :** "నాకిప్పటికీ వేడిగా ఉన్నప్పుడు చాలా బట్టలు నచ్చవు. కానీ అమ్మ మాత్రం బట్టల్లేకుండా పరిగెత్తవద్దని చెప్తుంది. నాకింకో విషయం చెప్పు. ఈ దేవుళ్ళంతా ఎప్పుడొచ్చారు?"

**బోధిచెట్టు :** మొదట్లో మనిషి తన అవసరాల కోసమే వస్తువుల్ని సేకరించేవాడు. అంతా గొప్ప తల్లిగర్భం నుంచే పుట్టిందనీ, సృష్టికి మూలం ఆ తల్లే అని నమ్మాడు. మనమిప్పటికీ "ఈ నేల మా భూమాత" అంటుంటాం. తర్వాత మనిషి వస్తువుల్ని సేకరించడం నుండీ స్వయంగా రూపొందించడం, అంటే తయారు చేయడం దశకి వచ్చాడు. ఆ ఆలోచనతో అతను "నన్ను కూడా ఎవరో చేసుంటారు' అనుకున్నాడు. నాకు బాగా తెల్సు. మీ దేవుళ్లందరి కంటే నేను పెద్దదాన్ని. మనిషి తనని తానెలా చేసుకున్నాడో నేను చూసాను. ఇంకా అతను పయనించాల్సిన దారి ఎంతో ఉంది. కొన్నిసార్లతడు ఇతర మనుషుల్తో కూడా చాలా క్రూరంగా ఉన్నాడు.

సంధ్యాసమయం అవుతోంది. రాముడి తల్లి ఎర్రని తాజా పూలబుట్ట పట్టుకుని వచ్చింది. ఆమె బుట్ట కిందపెట్టి బోధిచెట్టు ముందు మోకరిల్లి ప్రణామం చేసింది. రాముడి స్నేహితులంతా నెమ్మదిగా వెళ్ళిపోయాయి. ఆమె రాముడితో అంది, "రామా, రా. త్వరగా తయారుకా. ఈ రాత్రి జరిగే ఉత్సవంలో అంతా మన నందినే చూస్తుండిపోవాలి. తక్కిన ఎడ్లన్నింటికన్నా నందే ముందుండాలి. పద, నందిని ఇంటికి తీసుకెళ్ళి అలంకరిద్దాం."

